# భగవద్గీతా సూక్తావళి

1072
8268

వేదాంత గ్రంథమాల




ఓం

నమఋషిభ్యః.

“యోగక్షేమం వహామ్యహం”.

మతప్రభాకర ప్రథమ

గ్రంధమాల మరీచి



# భగవద్గీతామృతమ్.

ప్రభాకర ఉమామహేశ్వరపండిత గ్రధితము.

రెండవకూర్పు.

గుంటూరు హిందూమత విద్యార్థి సంఘము
వారిచే ప్రచురింపబడి

నెల్లూరు వైశ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.
హిందూమత సం॥ 195,58,85,018.

 [వెల 2 అణాలు.

# అవతారిక




శ్రేయమభిలషించిన మానవుఁడు ప్రయత్నము చేయ మొదలిడును. అతడు సంఘమునందే యొంటరిగా బ్రయత్నించినప్పుడు ఫలము సన్నయగును. అనగా మానవజీవితము సాంఘికప్రయత్నము నాశ్రయించినదని యర్థము. సాంఘికప్రయత్నము జనబాహుళ్యముయొక్క ఏకాభిప్రాయము నిమిడియున్నది. ఏకాభిప్రాయమనగా ఏకమతము. మతము స్వభావముగా జనించునదికాదు. అది గురూపదేశశక్తిజన్యము. మానవహృదయక్షేత్రములందు నాటంబడిన గురూపదేశవాక్యబీజము, శ్రద్ధాభక్తిసమన్విత నిరంతరధ్యానముచే నంకురించి, అభ్యాసజలముచే వర్ధిల్లి స్వానుష్ఠానమందు పుష్పించి పరోపదేశరూపముగా ఫలించి కల్పితాభిప్రాయమై యిష్టార్థముల బ్రసాదించును. పరోపదేశరూపమున బయలువెడలిన, యామతము జీవన్మతమని, ప్రసిద్ధిచెందును. ఈజీవన్మత మార్గసాంప్రదాయమైనది. ఈ మార్గమతమునాదికాలమున,

నాదిదేవునివలన తొలుత బ్రహ్మకుపదేశింపబడి లోకక్షేమార్థము ఋషిహృదంతరంగమున ప్రతిధ్వనించి పిమ్మట ఋషిముఖములనుండి వెలువడి మానవసంఘమందు వ్యాపించెను. ఏతన్మతసిద్ధాంతములు, అదిమొదలు బోధింపబడుచునేవచ్చుచుండె. బోధనోద్యమమతిశయించినకొలది మతప్రభావమధికమయ్యె. బుద్ధిపోషితంబులగు బౌద్ధమతములు వ్యాపకమున కుపక్రమించి, ప్రబలబుద్ధిమంతులచే ఖండింపబడి యప్రమాణము లగుచుండగా సిద్ధశకు లోబడక నానపెట్టినకొలది యెక్కువ పదునుకలదై యష్టమువచ్చినదానిని ఖండించు ఖడ్గమువలె నాస్తిమతముప్రతిహతప్రతిష్ఠకలదై లోకైకవ్రతపాల్యమతమై విరా

వివిధభాషాప్రయుక్త రాష్ట్రములుగా విభజింపబడిన హిందూదేశములో పండితులందరిప్పు నానాన్యజనహృదయములందు మతజ్ఞానము వ్యాపింపజేయ పరిత్యైన రాష్ట్రములందాయాభాషలం గ్రంథస్థపించు జీవస్మతప్రకర్తలుండుట యవసరమయ్యెను. ప్రకృతమాంధ్రదేశమునకు ఋషిపుత్రప్రచారకుల పురిగొల్పబడలేదు,

మాతృవాక్యంబు సుతులకు మాన్యమనుము
తల్లి మనతల్లి కల్పకవల్లి యనుము
అనుచు ఘోషించె మనతల్లి యాంధ్రులార

ఏతన్మాతృవాక్య పరంపరాప్రవాహ తరంగములు నాయుల్లమును నల్లకల్లోల మొనర్చినవి. తలచుకొనినపుడెల్ల శరీరము పులకాంకురములతో నిండుచుండెను. స్వస్థానబంధు మిత్రులవిడిచి మాతృసేవకై బుద్ధిచలించినది. కొంతకాలము పర్యటనము జరిగినది. తుదకు రాక్షసాంతమును సూచించు రాక్షస సంవత్సరాంత్యమాసాంత్య దివసాంతమున వచ్చెడి నలనామసంవత్సరారంభదినమున "హిందూయువక మత ప్రచారక సంఘ ప్రతిష్ఠాపనోద్యమ సంకల్ప బీజము" నాటబడినది ఆసంవత్సరమంతయు మతబీజము గర్భగతమైయుండెను. పింగళ సంవత్సరారంభమందా మతబీజము హి.యూ సంఘముగ నంకురింప మొదలిడెను. అది మొదలు "భీమవరము, వుండి నరసాపురము, అమలాపురము, రాజమహేంద్రి, కాకినాడ, పిఠాపురం, తుని, విశాఖపట్టణము, విజయనగరము, బర్హాంపురం, బెజవాడ, గుంటూరు, తెనాలి, నెల్లూరు, మొదలగు పురములందు స్వస్వరూపముల వృద్ధిగాంచుచుండె మఱియు

పరధర్మ వాసనామోహిత చిత్తచాంచల్య పిశాచగ్రహములు ఋషిమత సిద్ధాంత మంత్రములచేగాని పాఁదోలబడవు గనుక "మత ప్రభాకర గ్రంథమాలా" రూపమున తన్మంత్రములు ప్రకటితములగుచుండె.

అందుముందుగ సర్వ కార్యసాఫల్యార్థము దైవధ్యానము "గీతామృతము" అను పుస్తక రూపమున వెలువడి సుజన హృదయముల జొచ్చుటకు సిద్ధమగుచున్నది.

ఈయమృత రసము గ్రోలుటకు హిందూసోదరులు ప్రార్థింపఁబడుచున్నారు.

ఇట్లు,
హిందూమత విద్యార్థి.

# గీతామృతము

## స్నానకాలపఠనము.

1 గంగాగంగేతి యోబ్రూయాద్యోజనానాం శతైరపి।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి।
2 అంబ త్వద్దర్శనాన్ముక్తిః నజానే స్నానజంఫలం।
స్వర్గారోహణసోపాన మహాపుణ్యతరంగిణీ।

3 విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణించ భైరవం।
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికాం॥
4 అతితీక్ష్ణ మహాకాయ కల్పాంతదహనోపమ।
భైరవాయ నమస్తుభ్యం అనుజ్ఞాం దాతుమర్హసి।
5 త్వంరాజా సర్వతీర్థానాం త్వమేవజగతఃపితా।
యాచితో దేహిమేతీర్థం సర్వపాపాపనుత్తయే॥
6 యోసౌ సర్వగతో విష్ణుశ్చిత్స్వరూపీజనార్దనః।
సఏవద్రవరూపేణ గంగాంభో నాత్రసంశయః॥
7 నందినీ నలినీ సీతా। మాలినీచ మహాపగా।
విష్ణుపాదాబ్జసంభూతా గంగా త్రిపథగామినీ॥
8 భాగీరథీ భోగవతీ జాహ్నవీ త్రిదశేశ్వరీ
ద్వాదశైతాని నామాని యత్రయత్రజలాశయే।
స్నానకాలే పఠేన్నిత్యం మహాపాతక నాశనం।

ఈవిధమున గంగను ప్రార్థించి స్నానమాచరింపతగినది.

1. [గంగానదికి అనేక] శతముల యోజనములు [దూరముగా నివసించినవారైనను] ఎవరు గంగ, గంగ, యను నామముచ్చరించునో వారు సర్వపాపములనుండి విడువబడుదురు, మరియు (అతనికి) విష్ణుపదము లభించును.

2. ఓ గంగాజననీ, నిన్ను దర్శించుటచే, మోక్షము కలుగుచున్నది స్వర్గము నెక్కుటకు నీవు మెట్లువంటిదానవు. నీవు బహుపవిత్రమైనదానవు. నీయందు స్నానమాచరించుటచే కలిగిన ఫలమును నేను వర్ణింపలేను.

3. కాశీపురమునందుగల విశ్వేశ్వరుడు మొదలగు దేవతలకు నమస్కారము చేయుచున్నాను.

4. మిక్కిలి తీక్ష్ణమైన శరీరము కలవాడా! ప్రపంచనాశనమందు దేదీప్యమానముగా ప్రకాశించుచున్నవాడా; కాలభైరవుడవగు నీకు నమస్కారము చేయుచున్నాను. స్నానము నిమిత్తము, అనుజ్ఞనొసంగుము.

5. పుణ్యతీర్థంబులకు నీవు యజమానివి, నీవు జగమునకు తండ్రివి. నేను నిన్ను కోరితి. సర్వపాపములు నశించుటకయి, శేషస్థలమొసంగుము.

6. జగదంతర్యామియై, జ్ఞానస్వరూపియై, నిష్కల్మషుండై, యే విష్ణుపకలశో యాదేవుడు, ద్రవరూపమైన గంగాస్వరూపుడుగా నున్నాడు. ఇందు సందేహములేదు.

7. 8. నందినీమొదలగు గంగయొక్క పేర్లను స్నానకాలమందు తలంచవలెను. మహాపాపము నాశనమగుచున్నది.

## మతగీత.

హిందూపులార । యెన్నాళ్లీగతి ।
మందమతులమై । మాటికిచెడెదము ॥

1. మనపూర్వులు ఘన । మహాత్ములతో ।
మనుజోత్తములై । మనరే । వినరే      హిం ॥

2. మనమిట్లీగతి । మతహీనులమై ।
మనగానంతటి । మతిహీనులమె ॥

3. వేదమతమును । విధికృతమేగద ।
వేదవిదులమై । మోదముగనమె ॥

4. పండితపామర । తర్యాంతంబిది ।
దండిగమోక్షము । దయసేయదో కొ ॥

## శ్రీగణేశగీత.

1. యతోనంతశక్తేరనంతాశ్చజీవాయతో నిర్గుణాద
ప్రమేయా గుణాస్తే। యతో భాతిసర్వంత్రిధాభేదభిన్నం సదా
తంగణేశం నమామోభజామః

2. యతశ్చావిరాసీజ్జగత్సర్వమేతత్తథాబ్జాసనో విశ్వ
గో విశ్వగోప్తాయథేంద్రాదయో। దేవసంఘామనుష్యాశ్చనా
తంగణేశం నమామః ॥

3. యతో వహ్నిభానూ భవో భూర్జలంచయతస్సాగ
రాశ్చంద్రమా వ్యోమవాయుః। యతస్థావరా జంగమా
వృక్షసంఘాస్సదా తంగణేశం నమామో భజామః ॥

4. యతో దానవాః కిన్నరాయక్ష సంఘా యతశ్చారణా
వారణాశ్శ్వాపదాశ్చ। యతఃపక్షికీటాయతో వీరుధశ్చసదా
తంగణేశం

5. యతో బుద్ధిరజ్ఞాననాశో ముముక్షోర్యతస్సంపదో
భక్తసంతోషదాస్స్యుః। యతో విఘ్ననాశో యతః కార్య
సిద్ధిస్స దా తం గణేశం

6. యతఃపుత్రసంపద్యతో వాంఛితార్థో యతో ఽభక్త
విఘ్నస్సదానేకరూపః। యతశ్శోకమోహౌ యతః కామఏవ
సదా తం గణేశం

7. యతోనంతశక్తిస్స శేషో బభూవధరాధారణేనేక
రూపేచశక్తః యతో। నేకధా స్వర్గలోకాహి, నానా సదా తం
గణేశం.

8. యతో వేదవాచో। వికుంఠామనోభిస్సదానేతినేతీతి
యత్తాగృణంతి పరబ్రహ్మరూపం చిదానందభూతం సదా తం
గణేశం॥ పునరూచే గణాధీశస్తోత్రమేతత్పఠేన్నరః। త్రిసం

ధ్యంత్రిదినం తస్యసర్వకార్యంభవిష్యతి। యోజపేదష్టదివసం। శ్లోకాష్టక మిదంశుభం। అర్కవారే చతుర్థ్యాం తుసోష్ట సిద్ధిమవాప్నుయాత్। యఃపఠేన్మాసమాత్రంతు దశవారం దినేదినే। సంమోచయేద్బంధగతం రాజబద్ధం నసంశయః। విద్యాకామోలభేద్విద్యాం పుత్రార్థీ పుత్రమాప్నుయాత్। వాంఛితాన్ లభతే సర్వానేకవింశతివారతః యోజపేత్పరయా భక్త్యాగజాననపరోనరః। ఏవముక్త్వాతతో దేవశ్చాంతర్ధానం। గతః ప్రభుః॥ (గణేశపురాణం.)

గణేశ గీత. (ప్రాతస్స్మరణ) .

1. ప్రాతస్స్మరామి గణనాథ మనాథబంధుం। సిందూరపూర పరిశోభిత గండయుగ్మం। ఉద్దండ విఘ్నపరిఖండన చండదండ। మాఖండలాది సురనాయక బృందవంద్యం ॥

2. ప్రాతర్నమామి చతురానన వంద్యమాన। మిచ్ఛానుకూల మఖిలంచ, వరం దదానం। తంతుందిలం, ద్విరసన ప్రియ యజ్ఞసూత్రం। పుత్రంవిలాస చతురం శివయోః కుమారం ॥

3. ప్రాతర్భజామ్యభయదంఖలు భక్తశోక। దావానలంగణవిభుం వరకుంజరాస్యం। అజ్ఞాన కానన వినాశన

హావ్య వాహ । ముత్సాహవర్ధన మహంసుత మీశ్వరస్య ॥

4. శ్లోకత్రయమిదం పుణ్యం లోకత్రయవిభూషణాం । ప్రాతరుత్థాయ సతతం యఃపఠేత్ ప్రయతః పుమాన్ । ససర్వభోగానాప్నోతి గణాధిప పదంతతః ॥

విష్ణు గీత.

1. ప్రాతస్స్మరామి భవభీతి మహార్తిశాంత్యై। నారాయణాం గరుడవాహన మబ్జనాభం । గ్రాహాభిభూత మవవారణము క్తిహేతుం । చక్రాయుధం తరుణ వారిజపత్రనేత్రం ॥

2. ప్రాతర్నమామి మనసా వచసాచ మూర్ధ్నా । పాదారవిందయుగళం పరమస్య పుంసః నారాయణస్య నరకార్ణవతారణస్య । పారాయణ ప్రవణవిప్ర పరాయణస్య ॥

3. ప్రాతర్భజామి భజతామభయం కరం తం । ప్రాక్సర్వజన్మకృతపాప భయాపహత్యై । యోగ్రాహవక్త్రపతితాం ఘ్రింగజేంద్రఘోర । శోకప్రణాశ మకరోద్ధృత శంఖ చక్రః ॥ శ్లోకత్రయ మిదం పుణ్యం ప్రాతః (సాయం) కాలేపఠేత్తుయః లోకత్రయ గురుస్తస్మై దద్యాదాత్మ పదంహరిః

రామ గీత.

1. ప్రాతస్స్మరామి రఘునాథముఖారవిందం । మందస్మి

తం మధురభాషి విశాలఫాలం । కర్ణావలంబి చలకుండల శోభిగండం । కర్ణాంతదీర్ఘనయనం నయనాభిరామం ॥

2. ప్రాతర్భజామి రఘునాథకరారవిందం । రక్షోగణాయ భయదం వరదం నిజేభ్యః । యద్రాజసంసదివిభజ్య మహేశచాపం । సీతాకరగ్రహణ మంగళమాప సద్యః ॥

3. ప్రాతర్నమామి రఘునాథ పదారవిందం । పద్మాంకుశాది శుభరేఖి సుఖావహం మే । యోగీంద్రమానస మధువ్రతసేవ్యమానం । శాపాపహం సపది గౌతమ ధర్మపత్న్యాః ॥

4. ప్రాతర్వదామి వచసా రఘునాథనామ । వాగ్దోషహారి సకలం శమలంకరోతి । యత్పార్వతీ స్వపతినా సహ భోక్తుకామా । ప్రీత్యా సహస్రహరినామ సమంజజాప ॥

5. ప్రాతశ్శ్రయే శ్రుతినుతాం రఘునాథమూర్తిం । నీలాంబుజోత్పల సితేతరరత్ననీలాం । ఆముక్తమౌక్తిక విశేష విభూషణాఢ్యాం । ధ్యేయాం సమస్త మునిభిర్జన ముక్తి హేతుం ॥

*** శివ గీత ***

1. ప్రాతస్స్మరామి భవభీతిహరం సురేశం । గంగాధరం వృషభవాహన మంబికేశం । ఖట్వాంగశూలవరదా ఉభయ

హస్త మీశం। సంసారరోగహరమౌషధ మద్వితీయం ॥

2. ప్రాతర్నమామి గిరిశం గిరిజార్ధదేహం। సర్గస్థితి ప్రళయకారణ మాదిదేవం। విశ్వేశ్వరం విజితవిశ్వ మనోభిరామం। సంసారరోగహరమౌషధ మద్వితీయం ॥

3. ప్రాతర్భజామి శివమేక మనంతమాద్యం। వేదాంత వేద్య మనఘం పురుషం మహాన్తం। నామాదిభేదరహితం షడ్భావశూన్యం। సంసార రోగ×తీయం ॥

4. ప్రాతస్సముత్థాయ శివం విచింత్య। శ్లోకత్రయం యేఽనుదినం పఠన్తి। తేదుఃఖజాతం బహుజన్మ సంచితం। హిత్వాపదంయాంతి తదేవశంభోః ॥

సూర్య గీత.

1. ప్రాతస్స్మరామిఖలు తత్సవితుర్వరేణ్యం। రూపం హిమండల మృచోథ తనుర్యజూంషి। సామానియస్యకిరణాః ప్రభవాది హేతుం। బ్రహ్మాహరాత్మక మలక్ష్య మచింత్య రూపం ॥

2. ప్రాతర్నమామితరణిం తనువాఙ్మనోభి। బ్రహ్మేంద్ర పూర్వ కసురైర్నుత మర్చితంచ। వృష్టిప్రమోచన వినిగ్రహ హేతు భూతం। త్రైలోక్య పాలనపరంత్రి గుణాత్మకంచ ॥

3. ప్రాతర్భజామి సవితారమనంతశక్తిం। పాపౌఘ శత్రు భయరోగహరం పరంచ। తం సర్వలోక కలనాత్మక కాల మూర్తిం। సంసారబంధన విమోచన మాదిదేవం।

4. శ్లోకత్రయమిదం భానోః ప్రాతః ప్రాతః పఠేత్తుయః ససర్వ్వవ్యాధి నిర్మ్ముక్తః పరం సుఖమవాప్నుయాత్ ॥

ప్రాతస్స్మరణ.

1. బ్రహ్మమురారి స్త్రిపురాంతకోగ్ని (భాను)శ్శాను శ్శశీ భూమిసుతో బుధశ్చ। గురుశ్చ శుక్ర శ్శని రాహు కేతవః కుర్వంతుసర్వే మమసు ప్రభాతం॥

2. భృగుర్వసిష్ఠః క్రతురంగిరాశ్చమనుః పులస్త్యః పులహశ్చగౌతమః। రైభ్యోమరీచిశ్చ్యవనశ్చదక్షః। కుర్వంతు సర్వే మమసుప్రభాతం॥

3. సనత్కుమారః సనకస్సనందనః। సనాతనోప్యాసురిపింగళౌచ। సప్తస్వరాస్సప్తరసాతలాని కుర్వంతుసర్వే మమసు ప్రభాతం॥

4. సప్తార్ణవాస్సప్తకులాచలాశ్చ సప్తర్షయోద్వీపవనాని సప్త। భూరాదికృత్వాభువనాని సప్త కుర్వంతుసర్వే మమసు ప్రభాతం॥

5. పృథ్వీసగంధాసరసాస్తథాపఃస్పర్శీచవాయుర్జ్వలనస్స తేజః। నభస్సశబ్దం మహతాసహైవ। కుర్వంతుసర్వే మమసుప్రభాతం।

6. ఇత్థంప్రభాతే పరమం పవిత్రం పఠేత్స్మరేద్వా శృణుయాచ్చనిత్యం! దుఃఖప్రణాశస్త్విహసుప్రభాతంభవేచ్చ నిత్యం భగవత్ప్రసాదాత్॥

శివగీత.

1. నమోవేదావేద్యా, ఖిలజగదుపాదానమయత। స్వతంత్రా సామంతాన వధృతనిజాకారావిరతే॥ నివర్తంతే వాచశ్శివమ జరమప్రాప్యమనసా। యతోశక్తాస్స్తోతుం సకృదపిగుణాతీత శివతే।

2. త్వమేవేమంలోకం। నిఖిలమమలం। వ్యాప్యసతతం। తథైవాన్యంలోకం స్థితమనఘ దేవోత్తమవిభో। త్వమేవైతత్సృష్టం జగదఖిలమీశానభగవన్ కిలాసోయంకశ్చిత్తవశివనమో! మేఘశివతే॥

3. జగత్సృష్టం పూర్వంయదిశివ ఉమాకాంతసతతం। త్వయాలీలా మాత్రాత్తదపిసకలంరక్షితమభూత్। తదేవాగ్రేకాలప్రకటనయ నాగ్న్యద్భుతకణైర్జ గద్దగ్ధ్వాస్థాస్య।

స్వజహార నమోఽస్త్వ శివ తే॥

4. యయైవ శక్త్యా। సృష్ట్వా। జగదవనసంహారక్ష్య బహుధా। తతస్త్వం హ్యాత్యైత। న్నివససి। త్వ వా ధారమథవా ఇదం తేకింరూపం। నిరుపమనజానేః హారవిభో। నిర్గుః కోవాతే తమపిహి నమోఽభవ్య శివతే॥

5. యదేత త్తత్వంతే। సకలమపిత త్త్వేన। విదితం। న తే తత్వం తత్వాంవిదితమపి। తత్త్వేన విదితం। నచైత త్తత్వంచే। న్నియతమితి తత్వం। కిముభవే। న్నతేతత్త్వం తత్వంయదపిచ। నమోవేద్య శివతే॥

6. త్వమిందుర్భానుస్త్వంహుతభుగసి వాయుశ్చసలిలం త్వమేవాకాశోఽసి క్షితిరసి తథాత్మాసి భగవన్। తతస్సర్వా కార స్త్వమసిభవతో భిన్నమణువా। నతత్సత్యం సత్యం త్రినయన నమో నంత శివ! తే॥

7. త్వమేకో లోకానా మధిపతి రుమానాథ జగతాం। శరణ్యః వారిత్వస్త్వం జలనిధిరివానంత పయసాం। త్వదన్యో విద్వాంసం పవిత్రంతి నిర్వాణపథిరా। పృథక్సాత్యేత్యా ష్ట స్త్వ మపిహి! నమో నిత్య శివతే॥

8. తవైవాంశో। భాను స్తపతి విధురప్యేతి పవనః।

పవత్యేషో వహ్నిర్జ్వలతి సలిలంచ ప్రవహతి। తవాజ్ఞా
కారిత్వం సకల సురవర్గస్య సతతం త్వమేక స్స్వాతంత్ర్యం
వహసీహ నమోనంత శివతే !!

9. మహాదేహా మేయా నఘుగుణగణా గ్రిమసతతం
నమో భూయో భూయః పునరపి నమస్తే పునరపి పురారాతే
శంభో పునరపి నమస్తే శివవిభో నమో భూయో భూయ
శ్శివశివ నమోనంత శివతే !!

10. ప్రమాదాద్యే కేచి ద్వితత మపరాధా విహితాః।
కృతాస్స్యుస్తేపి ప్రశమ ముపయాంతు స్ఫుటతరం। శివశ్శ్రీ
మాన్ శంభో శివశివ మహేశేతిచజపన్। క్వచిల్లింగాకారే
శివహర వసామి స్థిరతరం !!

11. మయావిజ్ఞావేశా న్నిశమపి కృతా యేతు మనసా।
సకామేనా మేయా స్సతత మపరాధా బహువిధాః। త్వమై
వకం తవ్యాః క్వచిదపి శరీరేణ వచసా కృతాన్నైతే నూనం
శివశివ కృపాసాగరవిభో॥

## దేవీస్తుతి.

1. బ్రువంత్యేతే తత్త్వం భగవతి సదస్యే విమృశన్పరే
మాతః పారిమాణ్యసదసదపిచాన్యే వ్యసనసత్। చిరేణైత

త్సర్వం సమభిదధతే దేవిసుధియస్తదే తత్త్వన్మాయా విలసి తమశేషం జననిశివే॥

2. విదే విద్యే వేద్యే వినయసులభే వేదగుళికే విచిత్రే విశ్వాద్యే వివిధసమయే వీతజననే శివాజ్ఞాశీలస్థే శివపద వదాన్యే శివనిధే శివే మాతర్మహ్యం త్వయి వితరభక్తిం నిరుపమాం॥

3. పితామాతాభ్రాతా సుహృదనుచర స్సద్మగృహిణీ వపుః పుత్రః క్షేత్రం ధనమపియదామాం విజహతి। తదామే భిందానా సపదిభవమోహాంధతమసం। మహాజ్యోత్స్నే మాతర్భవ కరుణయా సన్నిధికరీ॥

4. శివస్త్వం శక్తిస్త్వం త్వమసి సమయస్త్వం సమయినీ త్వమాజ్ఞాత్వం దీక్షాత్వమయమణిమాదిర్గుణగణః। అవిద్యా త్వం విద్యాత్వమసినిఖిలం తత్త్వమపరం పృథక్త్వత్తః కించి ద్భగవతి నవీక్షామహమే॥

5 పురః పశ్చాదంతర్బహిరపరిమేయం పరిమితం చిరం స్థూలం సూక్ష్మం సకలమకలం గుహ్యమగుణం। దవీయోనే దీయస్సదసదితి విశ్వం భగవతీం సదాపశ్యాం త్వాజ్ఞాం భవసి భువనశ్రీర్భ జననీ॥

6. త్వయాసౌజానీతేరచయతి భవత్త్యైవసతతం త్వమే
వేచ్ఛాత్వం బత్వమసితనవోఽస్యస్య విహితాః। జగత్సామ్యం
శంభోర్వహసి పరమవ్యోమ వపుషస్తథాప్యర్ధం భూత్వా
విహరసి హరస్యేతి కిమిదం॥

7. సుతాదక్షస్యాదా కిలసకలమాతస్త్వ ముదభూస్స
రోషం తంహిత్వాతదనుగిరి రాజస్యతనయా। అనాద్యంతా
శంభో రపృథగపి శక్తిర్భగవతీ వివాహాజ్జాయాసీత్య హహాత
వకోవేత్తి చరితం॥

8. త్వంచంద్రికాశశిని తిగ్మరుచౌరుచిస్త్వం త్వంచేత
నాసి పురుషే పవనేబలంత్వం। త్వంసాదుతాసిసలిలే శిఖినిత్వ
మూష్మానిస్సార మేతదఖిలం త్వదృతే యదిస్యాత్॥

## భగవద్గీత.

1. అనేక బాహూదర వక్త్రనేత్రం। పశ్యామిత్వాం
సర్వతో నంతరూపం। నాంతంన మధ్యం నపున స్తవాదిం
పశ్యామివిశ్వేశ్వర। విశ్వరూప॥

2. కిరీటినం, గదినం, చక్రిణంచ, తేజోరాశిం సర్వతో
దీప్తిమంతం। పశ్యామిత్వాం దుర్నిరీక్షం సమంతాత్
దీప్తానలార్కద్యుతిమప్రమేయం॥

3. త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్యవిశ్వస్య పరంనిధానం । త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా । సనాతనస్త్వం పురుషోమతోమే॥

4 అనాదిమధ్యాంత మనన్త వీర్యమనన్తబాహుం శశిసూర్యనేత్రం । పశ్యామిత్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసావిశ్వమిదంతపంతం॥

5. రుద్రాదిత్యావసవోయేచసాధ్యావిశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ । గంధర్వ యక్షాసుర సిద్ధసంఘా వీక్షంతే త్వాం విస్మితాశ్చైవసర్వే॥

6. త్వమాదిదేవః పురుషః పురాణ । స్త్వమస్యవిశ్వస్యపరంనిధానం । వేత్తాసివేద్యం చపరంచధామ । త్వయాతతంవిశ్వమనంతరూప॥

7. వాయుర్యమోగ్నిర్వరుణ శ్శశాంకః । ప్రజాపతి స్త్వంప్రపితామహశ్చ । నమోనమస్తేస్తు సహస్రకృత్వః పునశ్చభూయోపి నమోనమస్తే॥

8. నమః పురస్తాదథపృష్ఠతస్తే నమోస్తుతే సర్వతఏవ సర్వ । అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోసిసర్వః॥

బహూపం బసుస్వాదుగంధం బవాఙ్మానస ప్రాప్యమై పూర్ణమై
నిత్యమై సత్యమై శుద్ధమై బుద్ధమై ముక్తమై శాంతమై
కేవలంబై నిరాకారమై సచ్చిదానంద రూపాత్మచైతన్యమై
స్వభూతోరు దేహేంద్రియ ప్రాణహృద్బుద్ధ్యహంకార
చిత్తాదిదృశ్య ప్రపంచంబునాదిత్యుడీ విశ్వమెల్లన్ వెలింగిం
పగా జేయురీతిం బ్రకాశింపగా జేయగా సాక్షివై యేక
పంబేకమై సర్వభాండంబులందంతటన్ లోపలన్ వెల్ప
లన్నిండియున్నట్టు లాకాశవాయ్వగ్ని వార్భూమి నానావిధా
శేషభూతంబు లందంతటన్ నిర్వ్యలిప్తుండవై యుండికర్తృత్వ
భోక్తృత్వ మంతృత్వ భర్తృత్వ హర్తృత్వముల్లా నురూ
పక్రియా సాధవర్ణాశ్రమంబుల్గుణంబుల్వివేకావివేకంబులున్
శోకమోహంబులున్ లేక యీస్థూల సూక్ష్మాదులన్
జాగ్రత్స్వప్నసుప్త్యాదులన్ బంచభూతంబులన్ బంచకోశం
బులన్ జూచుచున్ నిర్వికారుండవై నిర్వికల్పుండవై నిర్వి
చేష్టుండవై నిష్ప్రపంచుండవై నిర్విశేషుండవై నిర్గుణ
బ్రహ్మమాత్రుండవై యొప్పు నీదివ్య తత్వంబు నీపాత్కృపా
సంభృతాం చత్కటాక్షంబుచేతన్ గనుంగొంటి దేవా
నమస్తే నమస్తే నమస్తేనమః॥

# —* ఈశ్వర దండకం *—

శ్రీమన్మహాదేవ దివ్యస్వభావా జగన్మోహినీభావ
రాజీవసారంగ చర్మాంబరాడంబరా శంబరాంక స్ఫురచ్చారు
కోటీర కోటిగ్రహాధీశ తేజస్సమూహ ప్రకాశా గిరీశా రమే
శామరేశా జముఖ్యాన్య కాత్మీయకళ్యాణ చంచత్కిరీట
స్ఫురానేక దేదీప్యమానాగ్రమాణిక్యనీరాజితాంఘ్రిద్వయాం
భోరుహా మోహనాకార నిర్మోహ నిస్సంగ నిర్దోష నిశ్ఛిద్ర
నిశ్శేషనిర్ధూతపాపా జగద్దీప నిత్యానుకంపప్రధానా ధనేశాను
సంచార దారిద్ర్యరోగాది దుర్గాటవీ ఘోరలీలా కుఠారా
వియద్వాహినీలోల కల్లోలజాలాస్పదాభంగ శృంగార సం
గోత్తమాంగా మదేభాసురా దక్షభంగా హిరణ్యాదిచాప
మృడా శివకందర్పగర్వాపహారా భుజంగేంద్ర హారాపయో
రాశి తూణీ నీవాది దేవుండవై సర్వవిద్యాప్రపంచంబు
గల్పింప మన్నింప మాయింపగా గర్తవై హర్తవై భోక్తవై
సచ్చిదానందకందంబవై బ్రహ్మవైకుంఠ గర్భాదినామంబు
లన్ బొల్చివర్తింపుచున్ సత్యమై సత్యమైయున్న నిన్నాత్మ
భావింపగాలేక లోకంబు నిస్సార సంసార పాశంబులన్
జిక్కుచున్ బంచభూతాత్మకంబైన దేహంబుపై మోహ

విభ్రాంతి రేకెత్తింప పంచేంద్రియాసక్తులై మత్తులై శత్రు
వర్గంబు లొండొంటిఁ బాధింపఁగా బాల్యకౌమార వార్ధక్య
రూపంబులఁ బ్రియమెల్లఁ వ్యవహారియమునఁ జేసి
యాగానురక్తిఁ మహాఘోరకర్మంబు లిచ్ఛావిహారంబులఁ
జేయుగా వాయుచుఁ గోముకేశాద్రిస్థమాకుచాలింగనా*
లోలులై కొంతకాలంబు సంసారతాపత్రయమా ఖిలపాపాగ్ని
సంతప్తులై తృప్తులుఁగాక నానావిధోపాయ కాపట్య
సంయుక్తులై కోరికల్ మీరఁగా గోరుచుఁ బుత్రపుత్రీ కళ
త్రాది సంఘంబులఁ బ్రేమదల్ జూచి కాయంబు గృశింపఁగా
గొన్ని సంవత్సరంబుల్ జనంగా జరాక్రాంత సంక్రాంతులై
గంతులున్నావిచింతింపుచుఁ శ్లేష్మవాతాదిరోగంబు లొక్కు
మ్మడిఁ దొమ్మిగాఁ జుట్టిముట్టఁ భయంపన్నులై దగ్గుచుఁ
మూల్గుచుఁ నిగ్రహింతనయుఁ లేక దుఃఖంబులన్మ్రొంగి హా!
కా వసంబునందండిమూతల్ మహారోష జాజ్వల్యమానా
క్షులఁ జూచి శిక్షింపగా రౌరవానేక మహాపతాపంబులఁ
బొందుచుఁ గర్భకోశంబునఁ మర్త్యలోకంబునన్ బుట్టు
చుఁ గిట్టుచుఁ సౌఖ్యలేశంబు నుంగాన మిట్లున్న నీమాయ
దాటన్ వశంబె! భవత్పాద పంకేరుహధ్యాన సంపత్తి

సామాన్యమే ! భస్మరుద్రాక్ష మాలాదిచిహ్నంబులన్
వేదవేదాంత భావోజ్వలంబైన పంచాక్షరీ మంత్రరాజంబు
సదా బాసనిస్పృహులై ముక్తులై యున్న భక్తుల్ విరక్తుల్
భవన్నామసంకీర్తనాసక్తియుక్తుల్ గదా వారునీమూరు గారా
వ్రతాసక్తి సద్ధర్మముల్ బుణ్యకర్మంబులుం యజ్ఞముల్
యోగముల్ దానముల్ ధ్యానముల్ మౌనముల్ మంత్ర
ముల్ యంత్రముల్ తంత్రముల్ పూజలున్నీమముల్ సర్వ
మున్ గూడనీ సేవకుం సాటిరావంచు సర్వజ్ఞులెంచంగ
నాలించి విశ్వమున్ సదాచంచద్స్వాంతులై యన్యదైవం
బులం గొల్చి ప్రార్థించిరం భుక్తిముక్తుల్ ప్రసాదింపగా
నేర్తురే! నీవలెం లోకమెల్లం భవద్దివ్యతేజోమయంబంచు
నూహింతునెల్లప్పుడుం బూర్వపుణ్యప్రభావంబునం గన్ను
లారం మిమ్ముం జూడగంటిం దగం మోక్షసామ్రాజ్యమే
కొల్లగైకొంటి ధన్యుండనైతిం గృతార్థుండనైతిం మదీ
యంబులై యున్న నేరంబులూహింపగా నేల నన్నుం గృపా
దృష్టులం జూచి రక్షింపు రక్షింపవే సర్వలోక ప్రశస్తా
మహాకాలహస్తా నమస్తే నమస్తే నమస్తే నమః॥

ఆర్షగ్రంథములనుండి గైకొనిన ధర్మవచనముల ననుసరించి

ఆగ్నేయవిద్యార్థుల జీవయాత్రావిధి యటుచున్నది.

(1) సూర్యోదయమునకు పూర్వము మేల్కాంచి ముందుగా దైవస్మరణముగావించి, విద్యాభ్యాసమొనర్చి పిమ్మట బాహ్యమునకు వెళ్లవలెను. ఒకమైలుదూరము నడచుట కవసరమయినను. దేహవ్యాయామపద్ధతి నిందుగను నిండ వలసియున్నది.

(2) దంతములయందు చిక్కుకొనియుండు మాలిన్యము అజీర్ణ హేతువు కాన, జాగ్రతగా, దంతముల శుద్ధి చేయవలయును.

(3) చంద్రునియొక్క, లేక నక్షత్రములయొక్క ప్రకాశంతికిరణములు, ఏనీటియందు ప్రసరించునో అనీటి యందు స్నానమాచరింపవలెను. ఈపద్ధతి దేహారోగ్య జనకము.

(4) క్రమముగా రెండు మూడు చెంబులొప్పున నక్షత్రకిరణ ప్రసారితజలమును త్రాగుట కభ్యసించి పూర్ణారోగ్య వాగ్విత్వసంతతము ఎనిమిదిచేరులు శుద్ధజలము త్రాగుటమంచిది. అహినానాదిరూపక సంధ్యావందనము సేయుటకు మాచేరలకొలత యవసరము లేదు.

(5) వెనుకటి దినమున ధరించిన వస్త్రములను స్నానానంతరము తిరిగి ధరింపరాదు.

(6) శరీరమును తుడుచుకొని సాంబ్రాణి పొగచే శిరోభాగము నార్పివేసినయెడల దగ్గు పడిసెము మొదలగు రోగములు జనింపకుండును. శరీరము సమశీతోష్ణస్థితికి వచ్చుటకై దివ్యౌషధము సేవించుట ముఖ్యము.

(7) స్నానానంతరము జపమార్గము గదియందు, లేక, చదువుకొను గదియందు, ఆవునేతితో లేక మంచి నూనెతో దీపము వెలిగించియుంచవలెను. మరియు సాంబ్రాణివత్తినికాల్చి దానినొక స్థలమున గ్రుచ్చియుంచవలెను.

(8) తమమతముననుసరించి బొట్టుపెట్టుకొనవలెను.

(9) తాను ప్రేమించిన దైవమును ధ్యానించుటకై తత్ప్రతిమగల యొకపటము నెదుటనుంచుకొని, వెనుకకు, ముందుకు, దేహమునువంచక కూర్చుండిగాని, నిలువబడిగాని ధ్యానింపవలెను.

(10) అజీర్ణాది రోగజనకములై, మలినపాత్రలందు పాచిద్రవ్యములతో జేయబడి యమ్మబడుచుండు పకోడి మొదలగు వానిని భక్షింపరాదు.

(11) సాయంకాల, సూర్యకిరణములు ఆయుర్వృద్ధి ప్రదంబులుగాన, నాయెండలో విహరించి సూర్యాస్తమయ కాలము సద్దైవధ్యానమొనర్చి హీనపక్షము వారముకొక మారైన దేవాలయమునకేగి దేవుని దర్శింపవలెను.

(12) ఆముదపు దీపముయొక్క వెలుతురునందు చదువుకొనుట దేహమునకు నేత్రమునకు క్షేమప్రదమగును. ఒకవేళ కిరసనాయిల్ దీపముయొద్ద చదువవలసివచ్చెనేని, ముఖమును దీపమునకెదురుగానుంచక వెనుకకుతిరిగి పుస్తకముపై వెలుతురు వచ్చునట్లుచేసి విద్యాభ్యాసము చేయవలెను. తెల్లవారుజామున మేల్కాంచ వలసియున్నదిగాన, రాత్రులు 9 లేక 10 గంటలనుండియే నిద్రపోవలెను. మఱియు తత్కాలమందు బ్రహ్మచర్య ధర్మమును కాపాడుకొనుటకు యత్నింపవలెను.

వందనము.

ఈ సకలప్రపంచ మెవ్వనిచే సృజింపబడెను. ఎవ్వనిలో నుండెను. ఎవ్వనియందడంగును. దీనికన్నిటికి నెవ్వడాధారభూతుడు. ఎవ్వడు పరమేశ్వరుడు. ఎవ్వడు సర్వమును దానయై వెలసినవాడు. ఎవ్వడు పరిపూర్ణుడు.

అట్టి స్వయంభవుని స్వయంప్రకాశుని, సచ్చిదానంద స్వరూపుని, దేవాదిదేవుని ప్రార్థించుచున్నాము. ఈ భూలోక ప్రళయమున సర్వజీవులు లయమొందినపిమ్మట, నూర్ధ్వలోకమున స్వశరీరముతో నెవ్వాని నివ్వటిల్లునో ఆమహామహుని సేవింపుచున్నాము. నాట్యరంగమున నర్తించు నర్తకునివలె బహువిధమూర్తులను ధరించి యెవ్వాడు వర్తించునో, ఆజగన్మద్ధాకుని ధ్యానింపుచున్నాము. సర్వబాధముల బరిత్యజించి సర్వభూతములందు దయగలిగి సద్వ్రితముల సల్పి, మనశ్చపలత ముడిగి, మోక్షైకపరాయణులై వర్తించు మునిశ్రేష్ఠులు నిరంతరమే పరాత్పరుని పదారవిందములను భక్తిపూర్వకముగ భజింతురో అట్టి పరంధాముని భజించుచున్నాము. జగజ్జాలములనెల్ల సృజింప రక్షింప, శిక్షింప నెవడు సమర్థుడో అట్టి సర్వశక్తునకు నమస్కరింపుచున్నాము. ఏమహామహుండు నిరంతర శాంతస్వభావము కలవాడో నిత్యానంద స్వరూపుడో, ఏమహాపురుషుడు కైవల్య సామ్రాజ్యపదమున కధీశ్వరుడో, అట్టి వేదవేద్యునకు, భక్తిగమ్యునకు, విజ్ఞానమయునకు, సర్వజ్ఞునకు, సాష్టాంగ ప్రణామము లాచరించు

మన్నాము. ధర్మార్థకామములైన వర్గత్రియమందు ఫల విరక్తులై సంసారబంధమును వెలిగానుంచిన, సంశితాత్ములైతే పురాణ పురుషుని సేవించి ధన్యులైరో, తనాశ్రయించిన మోక్షాసక్తులకు సహాయ తనువుల బ్రసాదించి యే యనఘగుణుడు కరుణాకటాక్షముల వీక్షించి వారిని రక్షించెనో, శ్రుతిస్మృతులు, సంతతము సముత్కంఠితలో, హిరణ్యగర్భుని నాదిదేవునిగా గొనియాడుచున్నవో, సృష్టిస్థితిలయ శక్తిప్రభావమును లోకులకు వెల్లడి చేయుటకై యే యాదిదేవుడు, ప్రత్యక్షముగా నాదిత్యస్వరూపుడై జీవుల సుకృత దుష్కర్మముల గానుచు కర్మసాక్షియై వెలుగుచున్నాడో అట్టి జ్యోతిస్స్వరూపుని ధ్యానము చేయుచున్నాము.

ఓ మునిజనబృందా దుష్టశిక్షణార్థమై శిష్టరక్షణార్థమై ధర్మసంస్థాపనార్థమై ప్రతియుగమునందును, రామకృష్ణాద్యవతారములనెత్తి లీలలగావించి లోకము నుద్ధరించిన నీకు, మా ప్రాంజలి నమస్కారము లర్పించుచున్నాము.

ఓ దేవా ; మా శిరము నీ పాదములందును, మా వాక్కు నీ స్తోత్రమందును మా చేతులు నీపూజయందును, మా చె

వృలు నీకథల వినుటయందును, మాబుద్ధి, నీధ్యానమం
దును, మాకన్నులు, నీరూపము చూచుటయందున్ను.
ఎప్పుడు ఉండునట్లు అనుగ్రహింపుము, ఓదయానిధీ సభజ
నను విడువకయే, సర్వకార్యములను నేర్పరచునట్లు అను
గ్రహించుము. మామనలు మిగుల దయకలవాడవై
రక్షింపుము. ఓమహాపద్మాంభవా ! స్వవర్ణాశ్రమోచిత
ధర్మముల వీడి స్వవేషభాషల మాని పరధర్మ మవలం
బించి, ధనాయుర్విద్యాహీన సామ్రాజ్యహీనులమై. స్వాత్మ
మార్గానభిజ్ఞులమై మాయాంధకారమున బడిపడి దిక్కు
గానక త్రొక్కులాడుచున్న నీభక్తజనులమైన మమ్ము
ఆపదలనుండి రక్షింపుము. ఓమంత్రస్వరూపా! శుభకర
ములైన నీనామరూపముల నెవ్వరు సదా వినుచు, పొగ
డుచు ధ్యానించుచు దర్శించుచు, నీపదపల్లవములందు
దమచిత్తముల నిలిపి సంతసిల్లెదరో వారు జననమరణాది
దుఃఖముల నొందనేరరు.

ఓభక్తచింతామణీ ! మామనస్సు అనెడు కోతియెల్ల
పుడు ఆశలనెడు కొమ్మల నాశ్రయించి క్రీడించుచు మా
హామనసి అడవియందు మిగుల చాంచల్యము కలిగి స్వేచ్ఛగా

విహరించుచున్నది.

ఆ వానరమును గట్టిగ బట్టితెచ్చి భక్తియను త్రాటితో గట్టివేసి నీయధీనము చేసుకొనుము. నీకంటె దీనరక్షకుడు అన్యుడు లేడు.

ఓ లోకేశా సర్వజీవులయెడల, ప్రేమయును, నీభక్తవరులతో నెయ్యమును నాకెల్లపుడు కలుగు నటుల ప్రసాదింపుము. సుజనహృన్నివాస! మానవసాక్షియొక్క సదుపదేశములు సమ్మతి గాంచునట్లు గ్రహించుము. భక్తఫలప్రదాతా! మనః పూర్వకముగా నే నాచరించిన ధర్మములు ఫలవంతము లగునట్లాశీర్వదింపుము.



వైశ్య ముద్రాక్షరశాల, నెల్లూరు.



హిందూమత విద్యార్థి సంఘమున చేరదలచినవారుగాని, హిందూమత ప్రచారకులగు బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమా మహేశ్వర పండితులవారిని గూర్చి తెలియగలచిన వారుగాని, మత ప్రభాకర గ్రంథమాలకు చందాదారులుగా నుండనెంచిన వారుగాని,

**(1) భగవద్గీతామృతము రు. 0—2—0**

**(2) మత ప్రభ „ 0—4—0**

మొదలగు పుస్తకములు కావలసినవారుగాని ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

హిందూమత సంఘము.

చిలకలపూడి రామస్వామిగారు,

నర్సారావుపేట పోస్టు,

(గుంటూరు జిల్లా.)



